# సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

# శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజి


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

# అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ


గురు రామకృష్ణ పరమహంస


అమ్మ శారదా దేవి


గురు వివేకానంద


గురు సాయిబాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళ స్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

# వందే గురుపరంపరాం..








"ఉచిత గురుకుల విద్య ఫౌండేషన్" ద్వారా విలువలు, నైపుణ్యాలతో కూడిన విద్య ఉచితంగా + సులభంగా + ఆకర్షణీయంగా + నాణ్యతతో కూడి అందించే సేవా కార్యక్రమంలో బాగంగా ఈ పుస్తకాన్ని భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా) నుంచి సేకరించి అందిస్తున్నాము. ఇందుకు మేము వారికి కృతజ్ఞత తెలియచేసుకుంటున్నాము.

సాయి రామ్ వారి సేవల విస్తరణలో బాగంగా ఈ ఫౌండేషన్ స్థాపించబడినది. ఈ స్వచ్ఛంద సంస్థ ద్వారానే అన్ని సేవలు అందించబడును. ఇటువంటి పుస్తకాలు మీరు వ్రాసినట్లయితే (లేక) సేకరిస్తే మాకు తెలియచేయండి. మేము ప్రతి విద్యార్థికి ఉచితంగా అందేలా చేస్తాము, తద్వారా ఉన్నత విలువలు, నైపుణ్యాలు కలిగిన విద్యార్థులను మన దేశానికి అందించవచ్చు. మాతో కలిసి నవ భారత నిర్మాణ కార్యక్రమంలో పనిచేయుటకు, భాగస్వామ్యం అగుటకు ఆసక్తి ఉంటే సంప్రదించగలరు.

ఈ గ్రంథాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in
2) ఉచిత గురుకుల విద్య ఫౌండేషన్ వెబ్ సైట్ : www.freegurukul.org
3) సాయి రామ్ వెబ్ సైట్ : https://sites.google.com/site/sairealattitudemanagement
4) మొబైల్ ఆప్: Free Gurukul

గమనిక: భక్తి,జ్ఞాన,ధర్మ ప్రచారార్ధం ఉచితంగా eBook రూపంలో భారత ప్రభుత్వపు డిజిటల్ లైబ్రరీ సహాయంతో ఇవ్వడం జరిగింది. ఇది లాభార్జన దృష్టిలేని ఉచిత సేవ. ఈ సేవలో అంతర్జాలంలోని(ఇంటర్నెట్) లైసెన్సు / కాపీరైటు అభ్యంతరాలు లేనివి అనుకొన్న పుస్తకాలను గ్రహించటం జరిగినది. అనుకోకుండా ఏవైనా అభ్యంతరకరమైనవి ఉన్నచో మాకు తెలుప మనవి, వాటిని తొలగించగలము అని మనవి చేసుకొంటున్నాము.

Website: www.freegurukul.org    Mobile App: Free Gurukul    email: support@freegurukul.org
Facebook: www.facebook.com/freegurukul    Help Line / WhatsApp: 904 202 0123

" మన లక్ష్యం: విలువలు, నైపుణ్యాలతో కూడిన విద్య అనేది ఉచితంగా + సులభంగా + ఆకర్షణీయంగా + నాణ్యతతో కూడి అందరికి అందించబడాలి "

ఉచిత గురుకుల విద్య ఫౌండేషన్ – Free Gurukul Education Foundation

సర్వం పరమాత్మ పాద సమర్పణమస్తు

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

## http://www.new.dli.ernet.in

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| • Rashtrapati Bhavan<br>• CMU-Books<br>• Sanskrit<br>• TTD,Tirupathi<br>• Kerala Sahitya Akademi | • INSA | • Times of India<br>• Indian Express<br>• The Hindu<br>• Deccan Herald<br>• Eenadu<br>• Vaartha | • Tamil Heritage Foundation<br>• AnnaUniversity NEW! |

Title Beginning with.

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Author's Last Name

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Year

1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951-

Subject

Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects...

Language

Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

శ్రీ వేంకటేశాయ నమః

శ్రీ వైఖానస భగవచ్ఛాస్త్రే

# వాసాధికారః

(మహర్షి భృగు ప్రణీతమ్)


శ్రీ వైఖానస దివ్యసిద్ధాన్త వివర్ధినీ సభ పండితైః పరిష్కృతః
శ్రీమాన్ దీవి వెంకట రామాచార్యులు, గుంటూరు
శ్రీమాన్ నల్లూరు విఖనస భట్టాచార్యులు, నల్లూరు






ప్రచురణ :

**తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి**

**1999**

# ముందుమాట

"వాసాధికారః" - అనే ఈ సంస్కృత గ్రంథం ఇంతవరకు ముద్రితం కాలేదు. ఇందులో 54 అధ్యాయాలున్నాయి. ఈ గ్రంథ రచయిత భృగుమహర్షి. వీరు వైఖానస సూత్రకారులగు శ్రీ మద్విఖనోమునీంద్రులవారి నలువురు శిష్యుల్లో ఒకరు.

ఈ వైఖానస ఆగమ గ్రంథంలో దేవాలయాల్లో నిర్వహించే విగ్రహ ప్రతిష్ఠా విధానం, భగవంతుని ఆరాధన క్రమం, వేర్వేరు ఉత్సవాలు, ప్రాయశ్చిత్తాలు మొదలయిన వివిధ విషయాలు క్రమంగా చక్కగా విశదీకరింపబడి ఉన్నాయి.

ఈ గ్రంథకర్తయైన భృగుమహర్షి 'అధికారము'లనే పేరుతో సంస్కృతంలో అనేక గ్రంథాలను రచించారు. వాటిలో 'ఖిలాధికారము', 'క్రియాధికారము', 'ప్రకీర్ణాధికారము', 'యజ్ఞాధికారము' మున్నగు వాటిని తిరుమల తిరుపతి దేవస్థానం వారు ఇంతకు పూర్వం ప్రచురించి వున్నారు. ఆ వరుసలో ఇది మరో ప్రచురణ.

అమూల్యమైన ఈ గ్రంథం యొక్క వ్రాత పతులను నల్లూరు, గుంటూరు-మున్నగు చోటులందలి శ్రీ వైఖానస ఆగమ పండితుల నుండి సేకరించి, శుద్ధ ప్రతి తయారుచేసి, ప్రచురించడంలో సహకరించిన శ్రీ మాడంబాకం కృష్ణస్వామి శ్రీనివాస భట్టాచార్యులు (తి.తి.దే. ఆస్థాన పండితులు) గారికి శ్రీ వైఖానస దివ్య సిద్ధాంత **వివర్ధినీ సభ**, తిరుమల వారికి కృతజ్ఞతలు.

**యం.కె.ఆర్. వినాయక్**
కార్యనిర్వహణాధికారి
తిరుమల తిరుపతి దేవస్థానం

**తిరుపతి**
**25-11-97**

హరిః ఓమ్

# ప్రస్తావన

వాసాధికారము అను నీ గ్రంథము భృగుమహర్షి ప్రణీతము. భృగు మహర్షి గ్రంథములు పదమూడుగా చెప్పబడుచున్నవి. అందులో ఖిలాధికారము, క్రియాధికారము, ప్రకీర్ణాధికారము, యజ్ఞాధికారము అను నాలుగు పుస్తకములు లోగడ తిరుమల తిరుపతి దేవస్థానం వారు ప్రచురించినారు. ఇది ఆ వరుసలో అయిదవ గ్రంథము. వాసాధికారము ఇంతవరకు ముద్రణ కాలేదు. వ్రాత ప్రతిగానే వున్నది. అది మొట్టమొదటిసారిగా ఇప్పుడు ముద్రించబడుచున్నది.

వాసాధికారములోగల విశేషములను ఈ గ్రంథ పీఠికలో వివరించబడినవి ముఖ్యముగా ఈ గ్రంథములో ప్రాణాయామము, నాడీ చక్రము, న్యాసత్రయము, విగ్రహ స్వరూపము, విగ్రహప్రతిష్ఠా, విష్వక్సేనారాధన, శ్రీస్వామివారి నిత్యార్చనలు వివరముగా గలవు. వివిధ ఉత్సవములు, పుష్పయాగ, వసంతోత్సవ, డోలోత్సవ, పవిత్రోత్సవములు జరిపించు వివరములు, శ్రీస్వామివారి స్నపన (తిరుమంజనములు) ఇతర గ్రంథముల కంటె ఎక్కువ వివరములతో యున్నవి. ఈ గ్రంథము చాల ఉపయోగపడగలదు.

వ్రాత ప్రతులను సేకరించి గ్రంథముద్రణకు కృషి చేసిన శ్రీ దీవి విఖనసాచార్యులుగారు, తిరుమల వారికి శ్రీ వైఖానస దివ్యసిద్ధాన్త వివర్ధినీ సభకు, గ్రంథమును శ్రమతో పరిష్కరించిన పండితులు శ్రీ దీవి వెంకట రామాచార్యులుగారు, గుంటూరు, మరియు శ్రీ నల్లూరు విఖనసభట్టాచార్యులుగారు, నల్లూరు వారలకు ఆశీస్సులు.

అర్ష గ్రంథములు అచ్చువేయుటలో శ్రద్ధ వహించిన శ్రీ యమ్. కె. ఆర్. వినాయక్‌గారు (మాజీ కార్యనిర్వహణాధికారి) మరియు శ్రీ ఐ. వి. సుబ్బారావుగారు, ఐ.ఏ.యస్., ఎగ్జిక్యూటివ్ ఆఫీసరు, టి.టి.డి. వారికి, తిరుమల తిరుపతి దేవస్థాన ధర్మకర్తల మండలికి, శ్రీ యన్. యస్. శ్రీరామమూర్తి, ఎడిటరుగారికి నా నమస్సుమాంజలులు. కలియుగ దైవమైన శ్రీ వేంకటేశ్వరస్వామి వారు వీరందరికి ఆయురారోగ్య ఐశ్వర్యములు ప్రసాదించవలెనని ప్రార్థించుచున్నాను.

బుధజన విధేయుడు

**మాడంబాకం కృష్ణస్వామి శ్రీనివాస భట్టాచార్య**

తిరుమల, ఆస్థాన పండితులు,

10-1-99 తిరుమల తిరుపతి దేవస్థానం

శ్రీ శ్రీనివాసాయనమః
శ్రీమద్విఖనసగురవేనమః

## భృగుప్రోక్త వాసా ఽధికార

# పీఠికా

వైఖానసము - సంసారమందు తాపత్రయముతో బాధపడు మానవులకు శ్రీమహా విష్ణువు యొక్క సమారాధనమే అమృతత్వము కల్పించును. ఈ సమారాధనమునే భగవదారాధన అని అందురు. ఈ భగవదారాధనము అఖిల ప్రమాణములకు రాజవీధీ సమానము. ఈ ప్రమాణములందు వేదము సార్వభౌమ సదృశము. వేద ప్రతిపాదితము గనుక భగవదారాధన వైదికము. సృష్ట్యాదియందు సర్వజనులకు ప్రామాణికముగా సౌమ్యముగా నుండుటకు శ్రీమన్నారాయణుడు విఖనస మహర్షిని ఆవిర్భవింప చేసెను. ఆవిఖనస మహర్షిచే ప్రతిపాదింపబడిన భగవదారాధన రూపమైన మార్గమే వైఖానసము ఇది వైదికము. సౌమ్యము. ఇహపర సౌఖ్యసాధకము.

వైదికము-ఆగమము ఈ రెండును ఒకటిగాదు. వైదికము వేదమంత్ర ప్రయోగము. విఖనస మహర్షి తనశిష్యులైన భృగ్వత్రి కశ్యప మరీచిమునులకు అనుగ్రహించిన శాస్త్రమును ఆగమమందురు. అందులకే వైఖానసము నిగమము మరియు ఆగమము. భృగ్వాదిమునులు విఖనసమహర్షి అనుగ్రహించిన భగవదారాధనమును అధికార-తంత్ర-కాండ-పటలాత్మకముగా నిర్వచించిన విధానమే ఆగమము. దీనినే శ్రీభగవచ్ఛాస్త్రము శ్రీ శాస్త్రము అనిగూడ అందురు.

"వైఖానసేన సూత్రేణ నిషేకాది క్రియా న్వితై ః
బ్రాహ్మణైః క్రియమాణం యత్తత్సౌమ్యం వైదికం మతమ్"

విఖనసమహర్షిచే రచింపబడిన కల్పసూత్రమందలి నిషేకాది సంస్కారములచే పునీతులైన వారిచే చేయబడు భగవదారాధానమే సౌమ్యము మరియు వైదికము. ఈ భగవదారాధకులే వైఖానసులు. ఈ ఆరాధన ఇహ పర సాధకము.

ఈ వైఖానసము ఏకాయనీశాఖగా నిర్వచింపబడినది. వేదవిభాగమునకు పూర్వము వేదము ఒకే రాసిగా నుంచుటచే "ఋగాది" భేదము చెందలేదు. అనాడు వేదమునకు "యజుః" అను పేరుగలదు.

**"వేదానాం వ్యసనాత్పూర్వం ప్రాగ్రూపం మిళితంతుయత్**
**తాంతు వైఖానసీంశాఖాం ఇతివేద విదోవిదుః"**

ఈ వైఖానసమునకే "ఔఖేయ"మని మరియొక నామధేయము గలదు. "ఉఖా" అనగా బ్రహ్మదేవునియొక్క హృదయము, అందుండి ఆవిర్భవించిన సిద్ధాంత పరిణామమే "ఔఖేయము'. ఇట్లు పరిశీలించగా సర్వసమర్చనా సిద్ధాంతములకు ఇది ఆదిభూతము.

విఖనసుడు భగవదారాధన నిమిత్తము తొమ్మిది మంది మహర్షులలో నల్వురను శిష్యులుగా స్వీకరించి వారికి సార్ధకోటి గ్రంథాత్మకమైన శ్రీశాస్త్రమును బోధించిరి. భృగువు-అత్రి-కశ్యప-మరీచి అను ఈ నల్వురు విఖనసుని శిష్యులు. ఈ నల్వురు మానవుల సౌలభ్యము కొరకు శ్రీశాస్త్రమును చాతుర్లక్ష గ్రంథముగా సంగ్రహించి అనుగ్రహించిరి.

**భృగువు** : ఈ మహర్షి బ్రహ్మమానస పుత్రుడు. మహర్షులలో భృగుమహర్షి భగవదంశ సంజాతుడు. "మహర్షీణాం భృగురహమ్" ఇది గీతయందలి భగవద్వాక్యము. ఈ వాక్యము భృగుమహర్షి ప్రాచీనత్వమును తెలుపుచున్నది. లక్ష్మీదేవి ఈ మహర్షికి సంకల్పతనయయై శ్రీమన్నారాయణునకు నిత్యానపాయిని అయినది. శ్రీమన్నారాయణుని సమూర్తారాధన సమగ్రతను లోకకళ్యాణార్థము అధికార రూపముగా ఈ మహర్షి అనుగ్రహించినాడు. ఈ భృగుమహర్షి దేవాయతనమందు గర్భాలయ దక్షిణభిత్తి పార్శ్వమున పూజలందుకొనుచున్నాడు. మరియు గరుడ పురాణమున, బ్రహ్మయొక్కఆదేశముచే విఖనసుని నల్వురి శిష్యుల సిద్ధాంతములననుసరించి భారతదేశమున నాల్గు ప్రదేశములందు అర్చనాది కైంకర్యములు జరుగుచున్నవి.

"ఆదేశాత్ బ్రహ్మణో విష్ణుం శ్రీనివాసే 2 త్రిరర్చయేత్
కాశ్యపో విష్ణుధిష్ణానే శుభక్షేత్రే భృగుర్మని :
మరీచిర్మందరే విష్ణు మర్చయామాస కేశవమ్ ॥"

విఖనసుని ఆదేశముచే నల్వురు మహర్షులు నాల్గు పుణ్యక్షేత్రములందు తమ అర్చనా సిద్ధాంతములను ప్రవేశపెట్టిరి. వారి శిష్యప్రశిష్యులు దేశమంతయు భగవదారాధనరూపమైన సిద్ధాంతమును ప్రవేశపెట్టిరి. అందు భృగువు శుభక్షేత్రమున, అత్రి శ్రీశ్రీనివాసక్షేత్రమున (తిరుపతి), కశ్యపుడు విష్ణు ధిష్ణానక్షేత్రమున, మరీచి మందరమున ఆరాధన చేసినట్లు తెలియుచున్నది. శ్రీ శ్రీనివాస క్షేత్రము (తిరుమల-తిరుపతి) తప్ప తక్కిన క్షేత్రముల వివరము తెలియుట లేదు. ఈ మహర్షుల మూలపీఠము. నైమిశారణ్యము.

భృగువు గ్రంథములలో మిక్కిలి ప్రామాణ్యము వహించినది **వాసాధికారము** - ఇందు విగ్రహప్రతిష్ఠ - ఉత్సవము - అర్చన - ప్రాయశ్చితము - ఫలము. ఈ విషయములు విపులముగా స్పష్టముగా వివరింపబడినవి. చక్కని ఉపమానములు, శ్లేషలు శబ్ద నిర్వచనములు కలవు. రచన ధ్వని సూచకముగా సాగినది. ఉదాహరణ. "పుష్పేనష్టే ఫలంనాస్తి తస్మాత్సకళ నిష్కళే" వాసాధికార - దీక్షిత - ప్రతిష్ఠ - ప్రాయశ్చిత్తాది శబ్దములకు చక్కని నిర్వచనములు చెప్పబడినవి. ఆయా అధ్యాయములందు పై విషయములు పేర్కొనబడినవి. కొన్ని క్రియల ప్రయోగసరళి అనుక్రమణికవలె నడచినది. **ఉదా** ॥ "పవిత్రోత్సవము" కొన్ని క్రొత్త విషయములు చెప్పబడినవి. ఉదా : 'విష్వక్సేనుని జన్మవృత్తాంతము" శిల్ప శాస్త్రము ఎంతో విపులముగా ఈయబడినది. "ఇతి శాస్త్రస్య నిశ్చయః" ఇతి పూర్వజ శాసనమ్" ఈ వాక్యములు తరుచుగా ప్రయోగింప బడినవి. "నేను చెప్పినట్లే చేయవలయును, అన్యథా చేయరాదు. అని నిష్కర్షగా చెప్పబడినది. ఈ గ్రంథమున ఏబదిమూడు అధ్యాయములు గలవు.

"భగవదారాధనమే ఉత్తమ బ్రహ్మవిద్య"

పరమపదము చేరుటయే ఫలము. ఇది గ్రంథసారాంశము.

**అధ్యాయములందలి విషయ వైశిష్ట్యము :** ఏబది మూడు అధ్యాయములందలి విషయములలో కొన్ని మాత్రమే స్థాలీపులాక న్యాయముగా వివరింపబడినవి. షుమారు అరువది సంవత్సరముల నుండి వాసాధికార గ్రంథముద్రణ ప్రయత్నములు సాగి ఆగినవి. నేటికి శ్రీశ్రీనివాసుని అనుగ్రహము వలన టి.టి.డి. వారి సంపూర్ణ సహకారముతో, ప్రాచీనగ్రంథ సముద్ధరణమే ప్రధానముగా భావించి అహరహము శ్రమించుచున్న శ్రీమాన్ దీవి విఖనసాచార్యుల వారి కృషితో ఈ గ్రంథరాజము వెలువడుట ముదావహము. గ్రంథ గౌరవముతో విషయ వైశిష్ట్యమును అవలోకింపగోరుచున్నాము.

★ ప్రథమో ऽధ్యాయము- శ్రీవైఖానసభగవచ్ఛాస్త్ర వైభమును తెలిపెడి అర్థములు ప్రశ్నోత్తర రూపముగనే అనుగ్రహింపబడినవి. బ్రహ్మమానస పుత్రుడును మహత్తపోనిష్ఠా గరిష్ఠుడును, సర్వశాస్త్ర విశారదుడును భగవదారాధనా విషయ సంపూర్ణతా విశిష్టుడును అగు భృగుమహర్షిని లోకకల్యాణార్థముగా ఋషులు ప్రశ్నింతురు. వారి ప్రశ్నలకు భృగువు సమాధానములను వివరించి విపులముగా తెల్పును.

ప్రశ్న - ఏ దేవతను ఏ విధముగా పూజించవలయును. అందువలన ఫలమేమిటి? ఇది ప్రశ్న.

"వైదికోక్తేన మార్గేణ మంత్రైర్వేదోక్తవన్మయా
సమాహితమనాభూత్వా అర్చయేద్విష్ణు - మవ్యయమ్
తస్యవిష్ణో పదంగచ్ఛేత్కర్తవ్యమితి నిశ్చయః"

ఇది భృగువు సమాధానము. ఇది శ్రీశాస్త్ర పిండీకృత ఫలాంశము.

ఆలయనిర్మాణ స్థలము, స్థిత-ఆసీన-శయానముగా బింబ ప్రతిష్ఠ చెప్పబడినది. పశ్చిమము పల్లముగా గలది బ్రహ్మ క్షేత్రము. దక్షిణము పల్లముగా గలది రుద్రక్షేత్రముగా తెలుప బడినది.

సామృతకము - హారకము - బింబములకు ముందుగా తరుణాలయమందు అవిచ్ఛిన్నముగా అర్చనాదికములు గావింపబడి పిమ్మట ప్రధాన ఆలయమున ప్రతిష్ఠింపబడి అర్చించుట సామృతకము. తరుణాలయము లేకుండగా ప్రధాన ఆలయముననే ప్రతిష్ఠ అర్చనాదులు జరుగుట హారకము. ఇది ద్వితీయ పక్షము. ఆలయమున స్వామియందు న్యాసాదులుగావించి హృదయ పద్మమున పరమాత్మను ధ్యానించుట అంతర్యాగము. ప్రతిష్ఠిత బింబమును యథావిధిగా అర్చించుట బహిర్యాగము.

గృహబింబార్చన స్వార్థము. ఆలయార్చన పరార్థము. దేవాలయార్చనవలన గ్రామవాసులందరికి నిత్యాగ్నిహోత్ర ఫలము లభించును. వైఖానస సూత్రము ననుసరించి నిషేకాది సంస్కార సమన్వితుడు అగు గృహస్థుకాని బ్రహ్మచారిగాని ఆలయార్చన చేయవచ్చును. వైఖానసార్చన సౌమ్యమైనది. వేదవిహితము. వైదికము. భోగములను

కాక్షించువారు రుక్మిణీ సత్యభామా గరుడ సమేత శ్రీకృష్ణుని అర్చించవలయును. పరాక్రమము విజయముకోరు వారు హనుమత్సీతారామ లక్ష్మణ భరత శత్రుఘ్నులను అర్చించవలయును. ఇట్టి విశేషములు ఈ అధ్యాయమున గలవు.

★ **ద్వితీయ అధ్యాయము** : కర్షణ - బీజావాపము - గోగణ నివేదనలు వివరింపబడినవి. గ్రామవాస్తు వీరి పురాతంత్రము నందువలె ఆచరించవలయును. చెప్పబడని విషయములు కశ్యప మహర్షి విధమును ఆచరించమని తెలుపబడెను.

★ **తృతీయ అధ్యాయము** : ఇందు ఆద్యేష్టికా క్రమము నుండి ఆలయ మండపాదుల నిర్మాణ విధముగలదు. ఆలయ ప్రారంభమునకు మాఘమార్గశీర్షములు నిషేధింపబడెను. శిల్పవాస్తు శాస్త్ర మర్యాదలు వివరముగా నున్నవి. శిలా లక్షణములు గలవు. ప్రాసాద కుడ్య గోపురములకు నపుంసక శిలలు స్త్రీ మూర్తులకు స్త్రీ శిలలు విష్ణ్వాది పురుషమూర్తులకు పురుషశిలలు చెప్పబడినవి. పంచ షడ్వ్యూహముల వివరణ గలదు. విష్ణ్వాదిగా పంచమూర్తులు. యజ్ఞమూర్తితో కలసినవి షడ్వ్యూహములు. పంచవ్యూహములు నరనారాయణులు వరాహ నారసింహమూర్తులు నవవ్యూహములు. ఈ వ్యూహములను ప్రతిష్ఠించి పూజించిన పాకయజ్ఞ హవిర్యజ్ఞ సోమయజ్ఞాది మహాయజ్ఞముల ఫలము లభించును. సర్వశాన్తికరము ఐహిక ఆయుష్మిక ఫలము లభించునని తెలుపబడినది.

**త్రివిధ ఆశౌచము** : ఇది విశేషము. మన్త్రము మొదట "సూతక" మంత్రమధ్యమున 'పూతక" మత్రాంతమున ప్రేతకము అనునవి కలవు. వానిని తెలిసికొని మంత్రములను పఠించవలయును. ఈసంకేతములు మంత్రశాస్త్ర యోగశాస్త్ర సంబంధములు. "మన్త్రాదౌ పాశబీజంచ (ఆం) మన్త్రాన్తే అంకుశబీజకం (క్రోం) మన్త్రమధ్యే మాయాబీజం (హ్రీం)" ఇట్లు మంత్రశాస్త్రమున పూతక సూతక ప్రేతకములు వివరింపబడినవి. మన్త్రాంతమున మన్త్రాదిన సూతక ప్రేతక బీజములను వదలి మంత్రమధ్యమున పూతకబీజముంచి మంత్రము జపించవలయును.

**ఆకాశాది సృష్టిక్రమము గలదు** : పద్మము - చక్రము - శంఖము - గద- వీనితో విష్ణువును పూజించిన అభివృద్ధి కలుగును. గదా పద్మములు లేకుండగా స్థాపించిన వృద్ధి కలుగదు. ఈ అధ్యాయమున శిల్పము అద్భుతముగా వివరింపబడినది.

'మన్త్రేణ క్షీయతే పాపం తద్భావం జ్ఞానదీపకమ్
సంకల్పేనైవ దీక్షాభ్యాం పర్యాయేణైవ చోచ్యతే"

మన్త్రము వలన పాపము నశించును. జ్ఞానము వృద్ధియగును. సంకల్పము-దీక్ష అను పదములు పర్యాయ పదములు. పుణ్యాహ - ప్రతిసరబంధములు. వివరింపబడినవి. పుణ్యాహమున కృణుష్వపాజ సూక్తము, అగ్నిశ్శుచిః, అనుమంత్రములు పఠింపమని యున్నది. "దేవాగ్రేతు సమాసీనః పుణ్యాహమపి వాచయేత్" దేవుని ఎదుట కూర్చుండి యే పుణ్యాహము చేయవలయును. స్వామి ఎదుట నిలబడియే తైలోద్వర్తనము చేయ వలయును.

**వాసాధికార శబ్ద నిర్వచనము :**

"అల్పగ్రన్థంచ బహ్వార్థముక్తం సంక్షేపతోమయా
వాసోవాసద్వయంప్రోక్తమాఖ్యం వాసాధికారకమ్"

వస్త్రము సమర్పించుట అనగా వస్త్రయుగ్మము సమర్పించుటే. గ్రంథము అల్పముగా చెప్పినను అధికముగా చెప్పినట్లు భావించవలయును. గదా పద్మములుగల విష్ణువుని పూజించిన అభివృద్ధి కలుగునని గ్రహించవలయును.

★ **చతుర్థో ఒ_ధ్యాయము** : హౌత్రము పిమ్మట సర్వదేవార్చన పరిషద్దేవతలు వివరింపబడినవి. నిత్యానపాయనులైన అనంతగరుడ విష్వక్సేనులను తప్పక ప్రతిష్ఠించ వలయును. "అనపాయం వినాయత్ర దేవేశోన వసేద్బుధః" గరుడుని దేవాభిముఖముగా ప్రతిష్ఠించవలయును.

★ **పంచమో ఒ_ధ్యాయము** : భక్తజన ప్రతిష్ఠ ఇందు గలదు. భక్తజన బింబరూప - ప్రమాణ - ప్రతిష్ఠలు తెలుపబడినవి. డెబ్బది యొక్క భక్తులు పేర్కొనబడిరి. అందు సురలు రాక్షసులు భూతగరుడనాగకిన్నరులు యక్ష విద్యాధరులు సిద్ధులు ఋషులు మానవులు గలరు. భక్తబింబ ప్రతిష్ఠవలన ఫలము - గ్రామము లందు సుఖ శాంతులు వర్థిల్లును పంటలు విరివిగా పండును. కుటుంబములన్నియు ఇహ సౌఖ్యముల నంది విష్ణుసాయుజ్యము పొందును.

★ **షష్ఠో ఒ_ధ్యాయము** -అంకురార్పణము వివరింపబడినది. పాలికా కుంభ శరావ ములకు బ్రహ్మవిష్ణు ఈశానులు అధిదేవతలుగా చెప్పబడిరి. క్షుద్ర-భద్ర-అంకురార్పణముల వివరము గలదు.

★ **సప్తమో ఒ_ధ్యాయము** - విష్ణుప్రతిష్ఠా విధానము అనుక్రమణికవలె విపులముగా వివరింపబడినది.

"ప్రతిష్ఠా స్థాపనంచేతి ద్వివిధంచేతి పర్యయా"
ప్రతిష్ఠా స్థాపనములు సమానార్థకములు.

**ప్రతిష్ఠాశబ్ద నిర్వచనము -**

"ప్రతిబుధ్యా ప్రతిష్ఠా చేత్ప్రతి ష్ఠేత్యుచ్యతే బుధైః"

నిశ్చలమైన బుద్ధితో ప్రతిష్ఠ చేయుటయే ప్రతిష్ఠ అందురు. బింబముల దృష్టి - ఊర్ధ్వదృష్టి వలన భయము 'అధో దృష్టివలన ధనక్షయము కటాక్ష దృష్టివలన మరణము కలుగును. కనుక సమదృష్టియే ఉండవలయును. అధివాసకాలములు తెలుపుచు ముహూర్తకాలమైనను అధివాస చేయమని చెప్పబడినది.

మహాబేరముల విషయము - మహాబేరములను ప్రతిష్ఠించిన పిమ్మటే నయనోన్మీలనము చేయవలయును. అధివాసములందు ప్రోక్షణ చేయవలయును. దర్పణ స్నానము చేయించవలయును. వర్ణయుక్త బింబములకు గూడ దర్పణస్నానము చెప్పబడినది. బల్యుత్సవ స్నపన బేరములకు పంచగవ్య క్షీరాధివాసములు వదలి జలాధివాసము మాత్రము చేయవలయునని విశేషముగా చెప్పబడినది.

★ **అష్టమో౽ధ్యాయము-** ఇందు ప్రతిష్ఠా క్రియా క్రమము అగ్నిమధన వివరింపబడినది.

"హోమం దివానకుర్వీత స్థాపనం నచ రాత్రిషు" మహాశాంతి హోమములు రాత్రులందును బింబస్థాపన పగటియందు మాత్రమే చేయవలయును. విపర్యయమైన రాజారాష్ట్ర గ్రామములకు వినాశనముకలుగును. యజ్ఞములు ద్వివిధములు. జ్యోతిష్టోమాదులు, దేవయజనము. ఇందు దేవయజనమే శ్రేష్ఠమని చెప్పబడినది. యజమాని నశించినను దేవప్రతిష్ఠ స్థిరముగా నుండును. దేవయజ దినమువలన దేశమంతయు సుభిక్షముగా నుండును.

★ **నవమో౽ధ్యాయము-**కౌతుక బంధన, పంచాగ్నిప్రణయనములు వివరింపబడినవి.

★ **దశమో౽ధ్యాయము -** శయనాధివాసము కుంభపూజ ప్రాణాయామక్రమము నాడీచక్రలక్షణము వివరముగా గలవు.

★ **ఏకాదశో౽ధ్యాయము :** ప్రవర విషయము గలదు. రాజులకు మంత్రులకు ఇతరులకు వారి ప్రవరలు లేక కాశ్యపప్రవర, గ్రామ యజమానియైన వశిష్ఠ ప్రవర లేక కాశ్యపప్రవర, వైశ్యులు మొదలగు వారలకు గౌతమ ప్రవర, బ్రాహ్మణులకు వారి ప్రవరే చెప్పమని ఉన్నది.

★ **ద్వాదశో౽ధ్యాయము-**దారుబేర పరిత్యాగము తెలుపబడినది. కళలు కుంభమందా వాహన చేసిన పిమ్మట దారుబేరమును దహించుట - భూమియందు పూడ్చుట జలమునందు విడుచుట మొదలగునవి చేయవలయును సర్వదైవత్య హోమాంతమున విష్ణుసూక్త-మిన్ద్రాహుతి అశ్రావితాదులను త్రిరావృత్తముగా హోమము చెప్పబడినది.

★ **త్రయోదశో౽ధ్యాయము :** కుండములందు ప్రధానహోమములు వివరింపబడినవి. క్రియాహీనము మంత్రహీనము ఎంతమాత్రము జరుగరాదు. అట్లు జరిగిన, ధనము తేజస్సు ఆయువు నశించును. పారమాత్మిక మంత్రములన్నియు క్రమముగా పేర్కొనబడెను. అష్టాశీతిహోమము విశేషముగా వివరింపబడినది. మంత్ర ప్రారంభమున మంత్రాంతమున వ్యాహృతులు కొందరు చెప్పిరట. ప్రతిమంత్ర హోమ ప్రారంభమున చివర ఆ మంత్ర దేవతను స్మరించుచు హోమము చేయవలయును. అష్టాశీతి "విష్ణవే" మొదలగు పదిమంత్రములహోమమున దేవదేవుని స్మరించవలయును. "నారాయణాది" పదకొండు మంత్రముల యందు దేవునికి నమస్కరించవలయును. "పుణ్య నారాణాయ" మొదలగు పదిమంత్రములందు స్వామిని ధ్యానించవలయును "బాలాయ" అను రెండు మంత్రముల హోమమందు కేశవుని స్మరించవలయును "సత్యాయ" అను పది మంత్రముల యందు జనార్దనుని స్మరించవలయును. 'పురుషాయ' మొదలగు పది మంత్రములందు జగద్గురువగు దేవదేవుని స్మరించవలయును. "విష్ణుంక్రీడాత్మనే" అనే పదిహేడు మంత్రములందు

అచ్యుతుని తలంచవలయును. "పుణ్యాయ" మొదలగు పదునెనిమిది మంత్రములందు స్వామిని స్మరించుచు హోమము చేయవలయును.

"ఉక్తం విఖనసా ఏవమష్టాశీతి క్రమంస్మృతమ్"

ఇట్లు ఎనుబది ఎనిమిది మంత్రములు వివరింపబడినవి. స్విష్టకృత్తులు గార్హపత్య ఆవసథ్య ఆవహనీయ అన్వాహారములందు వేరు వేరుగా చేయవలయును. సభ్య పౌండరీకములందు చేయరాదు.

★ **చతుర్దశో ఽధ్యాయము** : వసోర్ధారాహోమము వివరింపబడినది. సభ్యాగ్నియందు విష్ణ్వాది పంచసూక్తములు ఏకాక్షర సూక్తము విష్ణుగాయత్రి అను ఈ ఏడు సూక్తములతో అవిచ్ఛిన్నమైన ఆజ్యధారతో నాల్గు లేక ఒక ఆవృత్తముగా హోమము చేయుటయే వసోర్ధారాహోమమని చెప్పబడినది.

★ **పంచదశో ఽధ్యాయము** : ఆవాహనక్రమము వివరింపబడినది. అర్చకస్వాములకు భూమి కల్పనము తెలుపబడినది. భూమి కల్పించుట "సర్వశాస్త్రేణ నిశ్చయః" అని చెప్పబడినది.

★ **షోడశో ఽధ్యాయము** - ఇందు శ్రీ భూదేవతామూర్తులకు పృథక్ప్రతిష్ఠ కలదు. స్వామివారి వివాహక్రమము వివరింపబడినది. యజమానుల ఇంటియందు స్వామివారి కల్యాణ ఉత్సవము చేసినచో హవిర్నివేదన చేయరాదు. కల్యాణ ఉత్సవము వలన ఇహపరసౌఖ్యములు కలుగును.

★ **సప్తదశో ఽధ్యాయము** : దశావతారమూర్తులలో మత్స్యకూర్మ వర్ణన ప్రతిష్ఠాదులు విపులముగా నున్నవి. ప్రతిమూర్తి ప్రతిష్ఠకు విశేష ఫలము చెప్పబడినది. పరమార్థము సాయుజ్యము.

★ **అష్టాదశో ఽధ్యాయము** - ఇందు వరాహ ప్రతిష్ఠ ఫలము కలదు.

★ **ఏకోనవింశో ఽధ్యాయము** : వామన త్రివిక్రమ మూర్తుల ప్రతిష్ఠ ఫలము కలదు.

★ **వింశో ఽధ్యాయము** - ఇందు పరశురామ - పరివార సహిత శ్రీరామ ప్రతిష్ఠలు గలవు. గుణత్రయముననుసరించి త్రిభంగిమముగా శ్రీరామ ప్రతిష్ఠ చెప్పబడినది. శ్రీకృష్ణ రూపములు అసంఖ్యాకములు.

"కృష్ణ రూపం అసంఖ్యాకం సంఖ్యావక్తుం నశక్యతే

★ **ఏకవింశో ఽధ్యాయము** - కృష్ణ పరివార ప్రతిష్ఠ చెప్పబడినది కల్కిరూపము అశ్వముఖము నరాకృతిగా తెల్పబడినది చతుర్భుజములు కలవు. జ్ఞానముద్రతో దేవీరహితముగా బౌద్ధ స్వరూపము చెప్పబడినది.

★ **ద్వావింశో ఽధ్యాయము** : కృష్ణాష్టమి - జయన్తిగా చెప్పబడినది. సింహమాసమున బహుళ అష్టమినాడు రోహిణి యున్నను లేకున్నను జయన్తి చెప్పబడినది. రోహిణితో గూడిన అష్టమే కృష్ణాష్టకని అశ్యపాదులు తెల్పిరి.

★ **త్రయోవింశో౽ధ్యాయము** - విష్వక్సేనుని అవతార కథ విపులముగా తెల్పబడినది. ఇతర ఆర్షములందు కాన వచ్చుటలేదు. విష్వక్సేనుని ప్రసాదము స్వీకరించరాదు. గోవులకు పెట్టవలయును. లేనిచో అగ్నియందుంచ వలయును. భక్తులు ప్రసాదము స్వీకరించ వచ్చునని కొందరు తెలుపుచున్నారు. అర్చనా ఫలము కోర్కెలు నెరవేరును సాయుజ్యము లభించును. జయాసూత్రవతుల సహితము అర్చన చెప్పబడినది. ఆలయమున దేవీరహితముగాను స్థిత-ఆసీనముగనే ఉండవలయును.

విహంగారాధనము - పత్నీసహితము - గరుడ ప్రతిష్ఠ అర్చనలు తెలుపబడినవి.

సుకీర్తి రుద్రమ అనువారు గరుడుని భార్యలు

★ **చతుర్వింశో౽ధ్యాయము** - పత్నుల సహితముగా అనంతుని ప్రతిష్ఠ అర్చన వివరింపబడినవి. జయ, పుష్టిక అను వారలు భార్యలు. అర్చనా ఫలము. కుష్ఠ అపస్మారాది భయంకర వ్యాధులు తగ్గును. నష్ట సంతానము తొలగి సంతానము కలుగును. ఆదివారాదులందు పూజించిన కామ్యములు నెరవేరును. క్రమముగా విష్వక్సేన గరుడ అనంత ప్రతిష్ఠ అర్చన ఫలములు వివరింపబడినవి.

ప్రదక్షిణ క్రమము విపులముగా ఈ గ్రంథమున వివరింపబడినది విష్ణు ప్రదక్షిణములు యుగ్మముగాగాని అయుగ్మముగాగాని చేయవచ్చును. ఇది విశేషము. పుణ్యతీర్థ సేవనముకన్న యజ్ఞఫలముకన్న ప్రదక్షిణ ఫలము అధికము. ప్రత్యక్ష ఫలదాయకము. ప్రదక్షిణలు మూడు రకములు. కామ్యము, పౌష్టికము, శాన్తికము. ఇందు పౌష్టిక ప్రదక్షిణము పుత్ర ప్రదము.

**ప్రదక్షిణ కాలములు** - కామ్యము మధ్యాహ్నకాలమున, శాన్తికము ప్రాతఃకాలమున, పౌష్టికము సాయంకాలము, చేయవలయును. ఇట్టి విశేషములు ప్రదక్షిణములగూర్చి ఈ అధ్యాయము వివరించినది.

★ **పంచ వింశో౽ధ్యాయము** - భగవదారాధన క్రమము వివరముగా వివరింపబడినది.

★ **షడ్వింశో౽ధ్యాయము** - శ్రీ భూసూక్తములతో శ్రీ భూదేవతా మూర్తులకు అర్చన చేసిన కలుగు ఫలము తెల్పబడెను.

**"ధనధాన్యాది వృద్ధించ పుత్రపౌత్రాది వృద్ధిదమ్**
**కళత్రం దాసభృత్యా పశుభూమ్యాదివృద్ధిదమ్"**

ప్రత్యేకముగా భూసూక్తము జపించిన "సస్యక్షేత్రాభివృద్ధి దమ్" అని చెప్పబడినది.

విగ్రహము - భోగము - ఉపచారము అనునవి పర్యాయ-పదములుగా పేర్కొనబడినవి.

★ **సప్తవింశో౽ధ్యాయము** - బలిపాత్రలక్షణము బలి విధానము తెల్పబడినది. నిత్యము సాయంకాలమున పుష్పబలి చెప్పబడినది. "సాయం పుష్పబలింకుర్యాత్" అర్చనాంగ ఉపకరణలకు దేవతాహ్వానము చెప్పబడినది. ఉదా: గుడమునకు విఘ్నేశుడు అధిదేవత.

★**అష్టావింశో ౭ధ్యాయము** - బలిబేర లక్షణము కలదు. బలిబేరము ఆసీనముగాను దేవీరహితముగాను ఉండవలయును.

★ **ఏకోన త్రింశో ౭ధ్యాయము** : సంధ్యారక్ష దీప లక్షణము సమర్పణ కాలము ఫలము తెలుపబడినది. ఫలము సాయుజ్యప్రాప్తి.

★ **త్రింశో ౭ధ్యాయము** - షడంగన్యాస ఏకాక్షర న్యాస అచోన్తన్యాసములు తెలుపబడినవి.

★ **ఏకత్రింశో ౭ధ్యాయము** - చక్రార్చన వివరింపబడినది. ఈ అర్చన రెండు రకములు "మూర్తించామూర్తి మేవచ" ఉత్సవ త్రివిధము, ధ్వజారోహణము గరుడ ప్రసాద భక్షణము అవరోహణము పేర్కొనబడెను.

★**గరుడ ప్రసాధ భక్షణ ఫలము** - స్త్రియశ్చాహూయ పుత్రార్థం వివాహార్థం తథైవచ। పుత్రార్థీ మృతపుత్రీవా రోగీ శతృజయార్థినః ॥ శతృజయము సంతానము వివాహము. రోగనివారణ కోరువారు సంతానము నశించుచున్నవారు, ప్రసాదము భక్షించవలయును.

★ **ద్వాత్రింశో ౭ధ్యాయము** - పుష్పయాగోత్సవ రథయాత్రలు గలవు.

★ **త్రయస్త్రింశో ౭ధ్యాయము** - ఇందు బలిక్రమము వసంత డోలోత్సవములు వివరింపబడినవి. ఇందు ధ్వజముల వివరమున్నది. 1) మాతృధ్వజము, 2) హంసధ్వజము, 3) వృషధ్వజము, 4) వీశధ్వజము, ఔదధ్వజము - ఇవి ధ్వజములు.

★ **చతుస్త్రింశో ౭ధ్యాయము** - ఉత్తమ మధ్యమ అధమ స్నపనలు, స్నపన చేయవలసిన కాలము తెల్పబడినది. అనుక్రమణికవలె ఈ ప్రయోగము సాగినది.

**పంచత్రింశో ౭ధ్యాయము** - నవవిధస్నపనలు, క్షుద్రభద్రస్నపనలు తెలుపబడినవి.

★ **షట్త్రింశో ౭ధ్యాయము** - ఏకాక్షర సూక్తము ప్రధానముగా మన్త్రాభిషేకము చెప్పబడినది. స్నపన, బలి, ఉత్సవ, బేరములకు చేయవలయును. బలిబేరాదులు లేనిచో ధృవమూర్తికే స్నపన చేయవలయును.

★**సప్తత్రింశో ౭ధ్యాయము** - శుద్ధస్నపన విధము వర్ణింపబడినది. "భక్తి యుక్తస్య యా పూజా అధమాప్యుత్తమాభవేత్, భక్తిహీనాచ యాపూజా ఉత్తమా అపినశ్యతి" ॥ అందువలన భక్తితో చేయవలయును.

★ **అష్టత్రింశో ౭ధ్యాయము** - పవిత్రోత్సవము పవిత్రారోపణ క్రమము ఉక్తమాసములు వర్జనీయమాసములు వివరింపబడినవి.

★ **ఏకోన చత్వారింశో ౭ధ్యాయము** - ఇందు పవిత్రములకు అధివాసములు విశేష ఆరాధనలు గలవు.

★ **చత్వారింశో ౭ధ్యాయము** - కౌతుకాది బింబములకు పవిత్రారోపణము తెలుపబడినది. సూత్రము పవిత్రము సమానార్థకముగా పేర్కొనబడెను. స్వామి ధరించిన పవిత్రములు ధరించినచో కోర్కెలు నెరవేరును. శరీరగత పాపము తొలగును. ఈ ఉత్సవమున ఆశౌచ విషయమిట్లున్నది. అంకురార్పణ జరిగిన పిమ్మట అశౌచము సంభవించిన

మార్జనము చేతనే ఆశౌచము తొలగును. సంవత్సరమంతయు జరుగు పూజా క్రమమున విపర్యాసము జరిగిన పవిత్రోత్సవము వలన దోషము తొలగిపోవును.

★ **ఏకచత్వారింశో ఽధ్యాయము** - ఇందు ప్రసాద వినియోగ క్రమము గలదు. ప్రసాద భక్షణ ఫలము. సర్వయజ్ఞ ఫలం లబ్ధ్వా సర్వపాపం వ్యపోహతి" అని చెప్పబడినది వేదవిదులు భక్తులు విష్ణుదేవుని ప్రసాదమును స్వీకరించిన పవిత్రులగుదురు. శ్రీ భూదేవతామూర్తుల ప్రసాదమును స్త్రీలకు ఇవ్వవలయును. ఇది విశేషము.

దమనోత్సవము - వనదేవతలకు బలిఇచ్చి వసంతుని ఆవాహనము చేసి విష్ణుసూక్తము పఠించుచు దమనము గ్రహించి స్వామిని పూజించవలయును.

★ **ద్విచత్వారింశో ఽధ్యాయము** - పునర్వసూత్సవము. మాఘశుద్ధ ద్వాదశి పునర్వసు నక్షత్రమున సీతారామలక్ష్మణులకు చేయు ఉత్సవమును "జయ" అని అందురు. ఈ పునర్వసూత్సవము పుత్ర ప్రదము "అపుత్రః పుత్రమాప్నోతి సర్వవృద్ధి కరంభవేత్" ఉత్సవములు మూడు విధములు. తీర్థోత్సవము, శాన్త్యుత్సవము, భక్త్యుత్సవము, తీర్థోత్సవము మధ్యాహ్న కాలమున, శాన్త్యుత్సవము పూర్వాహ్ణమున భక్త్యుత్సవము అపరాహ్ణమున చేయవలయునని చెప్పబడినది.

★ **త్రిచత్వారింశో ఽధ్యాయము** - ప్రాయశ్చిత్తము వివరింపబడినది.

★ **చతుశ్చత్వారింశో ఽధ్యాయము** - భూగుప్త ఉద్ధృత బింబ ప్రాయశ్చిత్తము తెల్పబడినది. అరాజకము యుద్ధములు మొదలగునవి సంభవించినపుడు సువర్ణ రజతాది బింబముల నుండి కళలు తీసి భూమిలో భద్రపరచవలయును. ఉపద్రవములు తొలగిన పిమ్మట ప్రాయశ్చిత్తము గావించి ప్రతిష్ఠించవలయును.

వంద సంవత్సరముల వరకు ప్రాయశ్చిత్తము చెప్పబడినది. వేయి సంవత్సరము గడచినచో బింబము నశించును. "శతాబ్దాది సహస్రాంతం ఏవమేవత్తు కారయేత్ సహస్రాబ్దే వ్యతీతేతు బేరనాశో నసంశయః" ప్రాయశ్చిత్తము కన్న పునఃప్రతిష్ఠ శ్రేష్ఠము." ప్రతిష్ఠాయాం పరంనాస్తి ప్రాయశ్చిత్తం ద్విజోత్తమ"

★ **ప్రాయశ్చిత్త శబ్ద నిర్వచనము** - "ప్రాయః పాపసమూహస్య చిత్తం తన్నాశకారణమ్ తద్విధానక్రమో యత్తత్ప్రాయశ్చిత్త విధింపరమ్" పాప సమూహములు నశించుటయే ప్రాయశ్చిత్తము.

★ **పంచ చత్వారింశో ఽధ్యాయము** - పునఃస్థాపన ఆవశ్యకత తద్విధానము తెల్పబడినది.

★ **షట్చత్వారింశో ఽధ్యాయము** - నిత్యార్చనా, ప్రాయశ్చిత్తము విపులముగా తెలుపబడినది.

★ **సప్తచత్వారింశో ఽధ్యాయము** - క్రియా విపర్యాసములకు అనగా ఒక క్రియకు మరియొకటి చేయుట జరిగిన ప్రాయశ్చిత్తము చెప్పబడినది. కొన్ని ఉపచారములు విపర్యాసమైన లఘుదోషము. వీటికి ప్రాయశ్చిత్తములు చెప్పబడినవి.

★ అష్ట చత్వారింశో உధ్యాయము - తంత్ర సంకర ప్రాయశ్చిత్తము. వైదికము అవైదికము అని రెండు విధములు. వైదికమున వైఖానసము మొదటిది బోధాయనము రెండవది. వైదికముగా ప్రతిష్ఠ చేసినచోట అవైదికములతో పూజ చేయరాదు తూర్పు ఆగ్నేయ నైర్బుతి దిక్కులందే బాలాలయ కల్పన చేయవలయును.

★ ఏకోనపంచాశో உధ్యాయము - స్వామిని తాకుటకు వీలులేని పాషండాదులు తాకినచో కాలనియమము లేకయే సంప్రోక్షణ చేయవలయును.

★ పంచాశో உధ్యాయము - ధృవబేర ప్రాయశ్చిత్తము ప్రత్యేకముగా చెప్పబడినది. ధృవబేరమునకు అంగములు ఉపాంగములు మహాంగములు ప్రత్యంగములు చెప్పబడినవి. కిరీటము శిరము కంఠము మొదలగునవి మహాంగములు. నాసిక కర్ణములు మొ॥నవి. ఉపాంగములు, శిరశ్చక్రము గదా మొ॥నవి అంగములు. నఖ-రోమములు-బ్రహ్మసూత్రము ఆభరణవస్త్రాదులు ప్రత్యంగములు. మహాంగములు భిన్నమైన ఆ బేరమున 'గోవాలరజ్జు భిర్బధ్వా"- వీటితో బంధించి నీటియందు వదలవలయును. తక్కినవానికి కూడ ప్రాయశ్చిత్తము చెప్పబడినది. ఇక్కడ, ఒక విశేషము చెప్పబడినది. ధృవబేరములందు స్త్రీ విగ్రహములు నష్టమై పురుష బేరమున్నచో క్రొత్త స్త్రీ మూర్తులను ప్రతిష్ఠించి పాణిగ్రహణము చేయవచ్చును. స్త్రీ విగ్రహములుండి క్రొత్త పురుష విగ్రహ ప్రతిష్ఠ జరిగిన పాణిగ్రహణము చేయరాదు. ఇందు వైదిక సాంప్రదాయము ధ్వనిరూపముగా సూచింపబడినది.

★ ఏకపంచాశో உధ్యాయము - జీర్ణబేర స్వరూపము ప్రాయశ్చిత్తము వివరింపబడినది.

★ ద్విపంచాశో உధ్యాయము - జీర్ణబేర స్వరూపము వివరింపబడినది.

★ త్రిపంచాశో உధ్యాయము - ఉత్సవ ప్రాయశ్చిత్తము తెలుపబడినది.

ఇట్లు ఈ వాసాధికారము ఏబది మూడు అధ్యాయములతో నిండియున్నది. ఈ గ్రంథమున అనేకానేక విషయములు చెప్పబడినవి. "వాసాధికారము" వ్రాత ప్రతులను ఆరింటిని పరిశీలించి ఈ ప్రతిని రూపొందించితిమి. అధిక పాఠములు చూపబడినవి. అక్కడక్కడ గ్రంథము నష్టమైనది. దానిని అట్లే ఉంచితిమి. మాకందిన వ్రాతప్రతుల వివరము.

1) శ్రీ వైఖానస దివ్య సిద్ధాన్త వివర్ధినీ సభ, తిరుమల
2) 'ఆగమప్రవర' శ్రీమాన్ దీవి కృష్ణస్వామి అయ్యంగార్, నల్లూరు
3) శ్రీమాన్ నారాయణం లక్ష్మీనృసింహాచార్యులుగారు, ఉల్లిపాలెం.
4) శ్రీమాన్ పండిత పరాంకుశం వెంకట కృష్ణమాచార్యులుగారు, పెనుగంచిప్రోలు.
5) శ్రీమాన్ పండిత దీవి గోపాలాచార్యులగారు, వేకనూరు.

6) శ్రీ బృందావనం శ్రీనివాసాచార్యులు, గూడవల్లి

ఆ యా సంస్థలకు ఆ పండిత వర్యులకు మా హృదయపూర్వక కృతజ్ఞతలు తెలుపుకొనుచున్నాము.

వైఖానస ఆర్షగ్రంథ సముద్ధరణ ముద్రణ ప్రచారము ధ్యేయముగా తలంచి ఆరోగ్యమును కూడ లెక్కింపక అహరహము శ్రమించుచు, పండితులను ప్రోత్సహించి అచిరకాలమున సుమారు అరువది గ్రంథముల ప్రచురణకు కారకులును శిల్పశాస్త్ర జ్యోతిష ప్రవీణులును శ్రీవిఖనస ఆశ్రమ శ్రీవైఖానస దివ్య సిద్ధాంత వివర్ధనీ సభా - కార్యనిర్వహణ దక్షులును అగు శ్రీమాన్ దీవి విఖనసాచార్యులవారికి (రిటైర్డు ఇంజనీర్ T.T.D.) మా హృదయపూర్వక అభినందన శతములు. వీరి ప్రోత్సాహమే ఈ గ్రంథ పరిశీలనకు మమ్ములను పురికొల్పినది. బ్రహ్మాండనాయకుడైన శ్రీ వెంకటేశ్వరస్వామి వీరికి ఆయురారోగ్య భోగభాగ్యములను ప్రసాదించుగాక. వీరు రూపకల్పన చేసిన అనేక ప్రణాళికలు సఫలీకృతమగుగాక.

వైఖానస ఆగమ చూడామణి శ్రీ శ్రీనివాస పదారవింద సేవాతత్పరుడు ప్రాచీనగ్రంథ సముద్ధరణైక దీక్షితుడును అగు శ్రీమాన్ మాడంబాకం కృష్ణస్వామి శ్రీనివాస భట్టాచార్యులవారికిని ఈ గ్రంథ ముద్రణ గావించిన తిరుమల తిరుపతి దేవస్థాన కార్యనిర్వహణాధికార్లకు, పాలకవర్గమునకును మరియు అధికార బృందమునకును కృతజ్ఞతా పూర్వక అభినందన శతములు తెలుపుకొనుచున్నాము. అనేకానేక గ్రంథముల అందముగా ముద్రించి సంఘసేవ చేయుచున్న శ్రీవాణీ ప్రెస్ (విజయవాడ) వారికి అభినందనలు తెలుపుచున్నాము.

ఇట్లు
బుధజన విధేయులు

'సాహిత్య విద్యాప్రవీణ' భాషాప్రవీణ
**పండిత దీవి వెంకట రామాచార్యులు**
(విశ్రాంత సంస్కృత ఉపన్యాసకులు, గుంటూరు)
"ఆగమ ప్రవర" "భాషాప్రవీణ"
**నల్లూరు విఖనస భట్టాచార్యులు**
(విశ్రాంత ఆంధ్రోపాధ్యాయులు, నల్లూరు)

భృగుప్రోక్త
వాసాధిఽకారే

# విషయసూచికా

**ఏకాదశో ౨ధ్యాయః**



**ద్వాదశో ౨ధ్యాయః**



**త్రయోదశో ౨ధ్యాయః**



**చతుర్దశో ౨ధ్యాయః**



**పంచదశో ౨ధ్యాయః**

**పంచవింశో ऽధ్యాయః**

**షడ్వింశో ऽధ్యాయః**



**సప్తవింశో ऽధ్యాయః**



**అష్టావింశో ऽధ్యాయః**



(భృగుః) (అత్రిః) (విఖనసాచార్యః) (కాశ్యపః) (మరీచిః)

హరిః ఓం

శ్రీశ్రీనివాసాయనమః

శ్రీవిఖనస మహాగురవేనమః

శ్రీవైఖానస భగవచ్ఛాస్త్రే భృగుప్రోక్తాయాం సంహితాయాం

# వాసాధికారః

## ప్రథమో౽ధ్యాయః

శ్రౌత స్మార్తాదికం కర్మ నిఖిలం యేన సూత్రితమ్
తస్మై సమస్త వేదార్థ విదే విఖనసే నమః ॥

### ఋషి ప్రశ్నోత్తరమ్

ఆశ్రమే సమ్యగాసీనం బ్రహ్మపుత్రం తపస్వినమ్ ।
సర్వదేవస్య వేత్తారం సర్వశాస్త్రార్థకోవిదమ్ ॥

సుప్రసన్నం మునిం శాంతమభిగమ్య ప్రణమ్యచ ॥

**★ ఋషయయూచుః ★**

భగవన్ కేనమార్గేణ కందేవం పూజయంతివై ।

కాన్‌లోకాంశ్చ గమిష్యన్తి శ్రోతుంకౌతుహలం ప్రభో ॥

**★ భృగురువాచ ★**

ఏతచ్ఛృణ్వంతు మునయః ప్రోక్తం చైవాథవైమయా ।

వైదికోక్తేనమార్గేణ మంత్రైర్వేదోక్త వన్మయా ।
సమాహితమనాభూత్వా అర్చయేద్విష్ణు మవ్యయమ్ ॥

తస్యవిష్ణోః పదంగచ్ఛే త్కర్తవ్యమితి నిశ్చయః ॥

**★ ఋషయ ఊచుః ★**

కిమత్రాలయ దేశేతు భూమింకింతు పరీక్షణమ్

కింరూపం తస్యధామ్నశ్చ కింవాచైవాస్య లక్షణమ్
ప్రాకారం గోపురం కింతు కిమత్ర స్థాపనక్రమమ్ ॥

వ్యూహత్రయం కథంకింతు తస్యభేదం కథంతువా
కిం తస్యార్చనం నిత్యం ఉత్సవంతుకథం తునః

సామృతం చేత్క థంకుర్యా ద్ధారకంతు తథైవచ
అమూర్తం కిం సమూర్తంతు ఆత్మార్థం కిం పరార్థకమ్

అంతర్యాగంతు కింప్రోక్తం బహిర్యాగం యథాక్రమమ్
తథైవ నిష్కలం కింతు సకళంచైవ కింపునః । ౯

తథాభిగమనం కింతు ఉపధానం కథం పునః
ఇజ్యాచైవ కథం ప్రోక్తం స్వాధ్యాయంతు కథంక్రమాత్ ౧౦

యోగక్రమస్తథా కింతు కిమత్రాగ్నేయ సౌమ్యకమ్
కిమత్ర సమయే భేదో దీక్షాచైవ కుతస్తథా । ౧౧

కథనం సక్రమా ద్జ్ఞేయం కర్షణాంతం కుతస్తథా
కిమత్ర పంచమూర్తంతు బేరస్యైకం కథంతువా ॥ ౧౨

దేవ్యోశ్చ సహితం కింతు తస్యరూపం కథంతువా
దేవీభ్యాం రహితస్థానం కథంత్వాసనకం కథమ్ ॥ ౧౩

శయనంతు కథంప్రోక్తం పరివారక్రమం తథా
తథైవ జ్ఞాన యోగంతు క్రియా శయ్యాత్మకం కథమ్ ॥ ౧౪

తత్సర్వం శ్రోతుమిచ్ఛామో వదత్వం వదతాం వర

**★ భగవద్విగ్రహ నివాస స్థానాని ★**

**★ భృగురువాచ ★**

ఏతత్సర్వం సమాఖ్యాతం శృణుధ్వంచ యథాక్రమమ్ ౧౫

గ్రామేచ నగరేవాథ పట్టణే ఖర్వటే ౽పివా
దణ్డకే కుటికేవాపి రాజధాన్యా మథాపివా ॥ ౧౬

అరణ్యే శైలమూలేవా పర్వతాగ్రే తథైవచ
నద్యాస్తీరే ౽బ్ధితీరేవా అన్యత్రోద్యాన కేపి ౽వా ॥ ౧౭

ఏతేష్వాలయ దేశేషు యథార్హం తత్రకారయేత్
అథవా రహితేతత్రకారయేద్దేశికోత్తమః ॥ ౧౮

గ్రామాగ్రహారయోర్మధ్యే దేవీయుక్తో నిషణ్ణకమ్
స్థితంవా తత్రకుర్వీత శయనం నైవకారయేత్ ౧౯

వారుణాది మహాశాసు శయానం స్థితమేవవా
ఆసీనంవాత్రకుర్వీత దేవీయుక్తంతుకారయేత్ ౨౦

అథవా రహితం తత్రకారయేద్దేశికోత్తమః
విదిక్షు తద్వదా సీనం స్థితంవా శయనం తువా । ౨౧

దేవీయుక్తం ప్రకుర్వీత భోగం తదుభయంబుధః
నదీసముద్ర పార్శ్వేషు శయానం స్థానమేవవా ၊ ౨౨

దేవీభ్యాంసహితం తత్ర విరహాద్యుభయంతథా
నగరేపట్టణేచైవ రాజధాన్యాం విశేషతః ॥ ౨౩

స్థితంవా చాసనం తత్ర యోగమార్గంతుకారయేత్
అరణ్యే కుటికేచైవ ఖర్వటేదండకే ఽపివా ॥ ౨౪

ఆసీనంవా స్థితంవాపి వీరమార్గేణకారయేత్
ఏవమాల యదేశంతు సర్వత్ర పరికల్పయేత్ ౨౫

తదూర్ధ్వే వక్ష్యతేచైవ మయాప్రోక్తం విచక్షణః
సంక్షేపేణ ప్రయోక్తవ్యం లక్షణస్య వసుంధరాకుం ॥ ౨౬

★ విష్ణుక్షేత్ర లక్షణమ్ ★

క్షీరయుక్తంచ తద్వృక్షం తులసీభిఃకు శైరపి
సరసఃపద్మయుక్తంతు దక్షిణావర్తతే జలమ్ ॥ ౨౭

పీతం శ్వేత నిభాంభూమిం ఉదక్ప్రాక్ప్రవణేతథా
ఏవం లక్షణసంయుక్తం విష్ణుక్షేత్రం ప్రకీర్తితమ్ ॥ ౨౮

★ భూపరీక్షా లక్షణమ్ ★

తద్భూమే ర్వలయంఖాత్వా తన్మృద్భిఃపూరయేత్క్రమాత్
అధికంచేన్మహావృద్ధిః న్యూనేవృద్ధిక్షయంభవేత్ ॥ ౨౯

★ గౌళ్యాదిస్వరఫలమ్ ★

గౌళీచ వాయసోవాపి దక్షిణే సుస్వరం యది
మహతీంవృద్ధిమాప్నోతి దేవదేవరతిర్భవేత్ ॥ 30

సృగాల లాంగలాభ్యాంతు పశ్చిమేయది వృద్ధిదమ్
అన్యైశ్చ విపరీతంచే త్తత్రభూమింవినా క్వచిత్ ॥ 3౧

తత్రగుల్మలతాదీని శల్యలోష్టతృణాదిషు
ఏతత్సర్వం వ్యపోహ్యైవ నిమ్నోన్నత సమీకృతమ్ ॥ 3౨

★ రుద్రబ్రహ్మాదిక్షేత్ర నిర్ణయః ★

ప్రవణం పశ్చిమంయత్ర తత్రరక్త నిభంక్రమాత్
బ్రహ్మక్షేత్ర మితిప్రోక్తం రుద్రక్షేత్రమిహోచ్యతే 33

ప్రవణం దక్షిణాకృష్టం రుద్రక్షేత్రముదాహృతమ్
ఏవంభూమిం పరీక్ష్యైవ విపరీతం నకారయేత్ ॥ ౩౪

★ విగ్రహభేదాః ★

చతుర్భుజం చతుర్హస్తం శంఖచక్రగదాధరమ్
దక్షిణే వరదంచేతి కటకం వామకేతథా ॥ ౩౫

అథవాసవ్య హస్తేన అభయం పరికీర్తితమ్
అన్యేన వామహస్తంచ వరదం కటకంతథా ॥ ౩౬

కట్యావలంబితంవాథ కృత్వాచైవ విచక్షణమ్ ॥
హస్తవిన్యాస భేదేన దేవమేవం ప్రకీర్తితమ్ ॥ ౩౭

అథకౌమోదకీ పద్మం కృత్వాతద్దేశికోత్తమః
అథకేచి ద్వదన్ తస్మిన్ దక్షిణాధః కరాదిషు ౩౮

పద్మం శఙ్ఖం తథాచక్రం ధారయన్ గదయాసహ
ఏవంరూపాణ్య సంఖ్యాకం యథేష్టం రూప మాహరేత్ ॥ ౩౯

లబ్ధరూపం గృహీత్వైవ తస్యపంచాదిమూర్తకమ్
తస్యబేరస్య పరితః కల్పయేత్పురుషాదికాన్ ॥ ౪౦

అద్ర్యగ్రేశైల మూలేవా ద్వైవికేషు నిరాయుధమ్
ఏవం రూపం సుసంప్రోక్తం ధామరూపం ప్రవక్ష్యతే ॥ ౪౧

★ విమానభేదాః ★

వేసరం ద్రావిడంచైవ నాగరంచ త్రిధాభవేత్
విగ్రహస్య చభేదేన నిత్యపూజాక్రమంతథా ॥ ౪౨

ప్రత్యేకం ద్విత్రిభేదేనద్వయాధిక మితిస్మృతమ్
ప్రాకారగోపురంచైవ మణ్డపాదీన్ తథైవచ ॥ ౪౩

రూపంతు పాదకేశాది పూర్వమేవ ప్రచోదితమ్
స్థాపనం చోత్సవం చైవ నిత్యపూజా క్రమం తథా ॥ ౪౪

విగ్రహస్యచ భేదంచ ప్రదక్షిణ విధిక్రమమ్
సూత్రం చారోపణం చైవ దమనారోపణం తథా ॥ ౪౫

అపరేతన్మయా ప్రోక్తం శృణుధ్వంమునిసత్తమాః
అథవక్ష్యే విశేషేణ సామ్పృతాహారక క్రమమ్ ॥ ౪౮

★ సామ్పృతక్రమః ★

నిత్యార్చన మవిచ్ఛిన్నం వర్తతే తరుణాలయే
పశ్చాన్మూలాలయే స్థాప్య సామ్పృతంతు తదుచ్యతే ॥ ౪౭

★ హారక క్రమమ్ ★

పూర్వం మూలాలయే స్థాప్య తరుణాలయహీనకమ్
ఏవంహార కంప్రోక్తం తత్ ద్వితీయం పరిచక్షతే ॥ ౪౮

★ అమూర్తారాధన క్రమః ★

సవితు స్వగ్నిహృన్మధ్యే స్థణ్డిలే సలిలే ऽపివా
దేవస్థానం చ సంకల్ప్య ధ్యాత్వానిత్యం సమర్చయేత్ ॥ ౪౯

తస్యరూపం ప్రతిష్ఠాప్య వాస్త్వంగాలయ పూజనమ్
ఏవం త్వమూర్తి పూజేతి సమూర్తం వక్ష్యతేమయా ॥ ౫౦

★ సమూర్తారాధన క్రమః ★

తామ్రేణాథ సువర్ణేన రజతేవాదారుణా తథా
శిలామృదావాకుర్వీత రూపం తత్రైవ కారయేత్ ౫౧

తస్యరూపం ప్రతిష్ఠాప్య వాస్త్వంగాలయ పూజనమ్
ఏవం సమూర్త మిత్యుక్తం పరార్థమితి కథ్యతే ॥ ౫౨

★ పరార్థ ఆత్మార్థ భేదః ★

స్వగృహేదేవమానీయ స్థాపయిత్వార్చయేద్బుధః ।
నిత్యం సకృద్ద్వికాలంవా ఆత్మార్థం యజనం స్మృతమ్ ॥ ౫౩

★ అంతర్యాగ క్రమః ★

అంతర్యాగ క్రమం వక్ష్యే శ్రుణుధ్వం ద్విజసత్తమాః
అరుణోదయకాలేతు–ఉత్థాయచ విచక్షణః ॥ ౫౪

నిద్రాంహిత్వా మహావిష్ణోః స్తోత్రం జప్త్వాసమాహితః
ప్రాఙ్ముఖోదఙ్ముఖోగమ్య బహిశ్శోధన మాచరేత్ ॥ ౫౫

మృదాగాత్ర విశుద్ధ్యర్థం విధినాశౌచ మాచరేత్
స్నానంకృత్వా యథాన్యాయ్యం దంతధావన పూర్వకమ్ ॥ ౫౬

జిహ్వాయాః శోధనం కుర్యాత్ యథావిధి సమాచరేత్
నిత్యకర్మ తతః కృత్వా సూత్రోక్తేన విధానతః ॥ ౫౭

దేవస్యమందిరంప్రాప్య నిత్యపూజోక్త మార్గతః
చందనాదీన్ సమాదాయ ఊర్ధ్వపుణ్డ్రాణి ధారయేత్ ॥ ౫౮

కేశవాదీన్న్యసిత్వాతు ధారయేత్తు విచక్షణః
కారయే చ్చైవ శుద్ధాత్మా కరన్యాసాదికం క్రమాత్ ॥ ౫౯

దేహన్యాసం తతః కుర్యా దంగన్యాసమతః పరమ్
పంచాంగం వా షడంగంవా అష్టాంగం వాథకార యేత్ ॥ ౬౦

దేవపార్శ్వే సుఖాసీనః ప్రాఙ్ముఖఉదఙ్ముఖోవా
అథవాచాత్ర తిష్ఠన్వా ఆత్మసూక్తం జపేద్బుధః ॥ ౬౧

ప్రాణాయామం తతఃకుర్యా ద్రేచ పూరకకుంభకైః
హృన్మధ్యే కమలం ధ్యాత్వా దళై ష్షోడశభిర్యుతమ్ ॥ ౬౨

కళాక్షర సమాయుక్తం కర్ణికాం ప్రకృతిం స్మరేత్
అథవాష్టదళైస్సృత్వా ద్విర్ద్విశ్చైవాక్షరం న్యసేత్ ॥ ౬౩

తన్మధ్యేకల్పయేద్విద్వాన్ రవిసోమాగ్నిమండలమ్
తన్మధ్యే సకళం ధ్యాత్వా విష్ణుం ప్రణవ రూపిణమ్ ॥ ౬౪

ఆదిబీజం స్మరేచ్చైవ అకారం తస్యచ స్థితః
సబ్రహ్మేతి శృతిం చైవ సర్వదేవమయం హరిమ్ ॥ ౬౫

తన్మధ్యేదీపవద్ధ్యాత్వా సాక్షాత్ప్రణవరూపకమ్
ప్రబోధ్యత్వర్ధస్యే వంచ కేశవాదీని భేదతః
ఏతైర్భేదైస్సమాఖ్యాతం తత్త్వమేకం ప్రచక్షతే ॥ ౬౬

ప్రతిరూపమితి గ్రాహ్యం తత్త్వమేకం కుతస్తథా
కిరీటహార వలయై రంగుళ్యాది విభేదతః ॥ ౬౭

ఏతద్రూపస్య భేదేతు రూపమేకం ప్రకీర్తితమ్
తస్మాత్తద్వత్త ధైకంతు నగ్రాహ్యం ద్విజసత్తమాః ॥ ౬౮

★ బహిర్యాగ క్రమః ★

అంతర్యాగ మిదం ప్రోక్తమ్, బహిర్యాగంచ కథ్యతే
సర్వావయవ సంపూర్ణం, దేవమానీ యబుద్ధిమాన్ ॥ ౬౯

తస్యదేవస్య హృదయే, ఆదిబీజం న్యసేత్క్రమాత్
ఏవం న్యాసం ప్రతిష్ఠేతి, ప్రోక్తమేతద్ద్విజర్షిభిః ॥ ౨౦

తద్దైవం పూజయేన్నిత్యం, బహిర్యాగ మితిస్మృతమ్
అవ్యయస్యాది రూపస్య, పరంబ్రహ్మేతి కథ్యతే ॥ ౨౧

**★ సకలనిష్కళ భేదః ★**

నిష్కళం సకళం చేతి, సమూర్తారాధనం ద్విధా
సర్వపాదస్తు సందేహో, పూర్వపక్షేతు నిష్కళమ్ ॥ ౨౨

సకళం నిష్కళం బ్రహ్మ, ఇతిశాస్త్రస్య నిర్ణయః
నిష్కళం పూర్వమేవస్యా, త్పశ్చాత్సకలముచ్యతే ॥ ౨౩

పశ్చాదావాహనో ద్వాసౌ, దేవం ప్రతిసమాచరేత్
ధృవబేరం యదిస్యాత్తు చోభయం తత్రనాచరేత్ ॥ ౨౪

అథవావాహనోద్వాసౌ, నిత్యే నైమిత్తికేచన
తయోరత్రైవ కృత్వాతు, జంగమే పరికీర్తితమ్ ॥ ౨౫

సకలం నిష్కళంతూక్త్వా, దేహం సకలముచ్యతే ॥
నిష్కళాత్సకళంజాతం సర్వత్ర పరిదృశ్యతే ॥ ౨౬

పుష్పేనష్టే ఫలం నాస్తి, తస్మాత్సకళ నిష్కళే
ఏతద్భేదమితిం ప్రోక్తం, గుహ్యంమే తదుదాహృతమ్ ॥ ౨౭

**ఆచార్య లక్షణమ్**

తదూర్ధ్వే వక్ష్యమాణేన, శృణో త్వాచార్య లక్షణమ్ ।
సూత్రోక్తేన విధానేన, నిషేకాదిక్రి యాన్వితః ॥ ౨౮

సంస్కారైస్సంస్కృతం విప్రం, యోనిశుద్ధమరోగిణం
బ్రహ్మవాదేన మన్త్రజ్ఞ మాశ్రమస్థం జితేంద్రియమ్ ॥ ౨౯

జగదుత్పత్తి కంసర్వం తత్త్వార్థేషుచ కోవిదమ్
శాస్త్రజ్ఞంచ స్థిత ప్రజ్ఞం శ్రద్ధాస్తిక్య యుతంపరమ్ ॥ ౩౦

ప్రతిష్ఠాకర్మకుశలం ఊహాపోహనిరూపకమ్
సాగ్నికం చకులీనంచ, విషయేష్వ ప్రతిష్ఠితమ్ ॥ ౩౧

స్వశాస్త్రేచైవ విద్వాంసం, నిత్యస్వాధ్యాయ తత్పరమ్
పత్న్యా పత్యాగ్ని సంయుక్తం, తథా చైవో దితోత్థితమ్ ॥ ౮౨

సుగంధస్యాంగ సంయుక్తం, జ్ఞానం తస్యోత్కలం శృతమ్
సువృత్తం శీలసంపన్నం పూర్ణ పుష్టాంగ సంయుతమ్ ॥ ౮౩

నిష్కళం సకళం తస్య ధ్యానయుక్తం చ నిష్కళమ్
పారంపర్య క్రమాయాతం గురువర్యోపదేశితమ్ ॥ ౮౪

మన్త్ర కల్పవిశేషజ్ఞం వైఖానసమిమం శుచిమ్
అనన్యదేవతా భక్తం వైష్ణవం విష్ణుభక్తిదమ్ ॥ ౮౫

ఆచార్యం వరయేత్పూర్వం, భూపరీక్షాదికర్మసు
ఏతైర్లక్షణ సంయుక్తం, స్వాచార్యస్య సమీపతః ॥ ౮౬

శిష్యోగత్వా ప్రణమ్యైవ, మభిగమ్య పురస్థితః
శాస్త్రస్యకృత్స్నం సంశ్రోతుం, దీక్షా పూర్వోపదానకమ్ ॥ ౮౭

కారయే త్సమ్యక్ శుద్ధాత్మా, నిత్యం విధివదర్చనం
ఏవంతు యజనం స్మృత్వా, స్వాధ్యాయస్యక్రమం శృణు ॥ ౮౮

సర్వవేదార్థ వేత్తారం, సూత్ర స్యాధ్యయనం సహ
క్రమాద్ద్వ తంచరే త్తత్ర, తథాచైవ విసర్జనమ్ ॥ ౮౯

ఏవం క్రమేణ కర్తవ్యమ్, తదేవాధ్యయన క్రమమ్
తథైవ పంచవింశద్భిః స్వరూపస్థితమేవచ ॥ ౯౦

★ శిష్య లక్షణమ్। ★

ఆత్మతత్త్వ స్థితిం స్మృత్వా తథాయోగక్రమం విదుః
శిష్యస్య లక్షణం వక్ష్యే శృణుధ్వంతు యథాక్రమమ్ ॥ ౯౧

ధాతు పాఠ బలిక్షేత్ర మన్త్రతన్త్రార్థ సాధకః (?)
అన్యత్ర నిరపేక్షశ్చ కృతసిద్ధిమపేక్షకః ॥ ౯౨

సంసారభయ భీతాత్మా ముక్తిమార్గాభిలాషితః
అధూర్తోమతిమాన్ శాన్తశ్శాంతోక్తి స్తాపవర్జితః ॥ ౯౩

అనన్య దేవతా భక్తః, ప్రేక్షణార్థీ ప్రియంవదః
జితక్రోధస్సత్యభాషీ మిథ్యావిషయ వర్జితః ॥ ౯౪

ఉపచార క్షమశ్శౌచః, భవ్యరూపీ క్షమాపరః
శరీరమర్థ ప్రాణౌచ సద్గురుభ్యో నివేదయేత్ ॥ ౯౫

కర్మణా మనసా వాచా, గురూణాం భక్తి తత్పరః
మాత్సర్యానృత నిర్ముక్తో నాభ్యంతర పరీక్షకః ॥ ౯౬
(విష్ణు తత్వాభి కాంక్షీచశిష్యో ఽయం కులదీపకః)

ఏవం భూతగుణం శిష్యం, సుపరీ క్ష్యచయత్నతః
ఆచార్యశ్శిక్షయేత్పూర్వం సదాచారస్య మార్గతః ॥ ౯౭

శిష్యం భక్తి సమోపేతం అశిష్యం శిక్షయేద్గురుః
శిష్యేనచ కృతంపాపం గురోర్భవతి నిశ్చయః ॥ ౯౮

ఏవం శిష్యగుణం ప్రోక్తం, మార్గో ఽయం భేదఉచ్యతే
అత ఊర్ధ్వం ప్రవక్ష్యామి, వైదికంత దుదాహృతమ్ ॥ ౯౯

**★ వైఖానస శ్రీశాస్త్ర సంఖ్యా। ★**

మార్గం చతుర్విధం ప్రోక్తం, మయాచైవ మరీచినా ।
అత్రేయం కాశ్యపేయంచ, మార్గం తత్ర చతుష్టయమ్ ॥ ౧౦౦

గ్రన్థసంఖ్యా విశేషేణ, ప్రతిమార్గం ప్రచక్షతే
సూత్రం విఖనసాప్రోక్తం పురాచైవ సువిస్తరమ్ ॥ ౧౦౧

హరేః పూజా విధానంత త్తదుక్తం వేదమార్గతః
మానాధికరణాద్యాదీ, న్స్వక్ృతేచ యథాక్రమమ్
ఖిలం ఖిక్రియాధికారంచ, పురాతంత్రం తథైవ చ ॥ ౧౦౨

వాసాధికరణం జ్ఞేయం, చిత్రాధికరణం తథా
మానాధికరణం చైవ, ప్రకీర్ణాధి కరణంచ ౧౦౩

నిరుక్త మధికారం చ, అర్చనస్యాధి కారకమ్
యజ్ఞాధికరణం చైవ, వర్ణాధికరణం తథా ॥ ౧౦౪

ప్రతిగృహ్యాధికారంచ, మయాప్రోక్తాశ్చ సంహితాః
ఏతైశ్చైవ చతుష్షష్టి, గ్రన్థ సంఖ్యాక్రమం విదుః ॥ ౧౦౫

ప్రథమస్యోత్తరం తంత్రం, విష్ణుతంత్రమతః పరం
అత్రేయన్తు తథాపూర్వం, తంత్రం చైవ చతుష్టయమ్ ॥ (?) ౧౦౬

అష్టాశీతి సహస్రంతు, గ్రన్థసంఖ్యా తదుచ్యతే
సనాతనం కాశ్యపంచ, సత్యకాణ్డమతః పరమ్॥ ౧౦౭

తర్కశ్చ జ్ఞానకాండంచ, పంచకాండమితి స్మృతమ్
చతుష్షోడశ సాహస్రం, గ్రన్థసంఖ్యాతుకాశ్యపమ్ ॥ ౧౦౮

జయాశ్చ సంహితాశ్చైవ, అనన్తాఖ్యమతః పరమ్
సంజ్ఞాన సంహితాశ్చైవ విజీతాఖ్యమతః పరమ్
వీరాఖ్యం విజయం చైవ, సత్యాఖ్యంచ తతః పరమ్ ॥ ౧౦౯

జ్ఞానస్య సంహితాశ్చైవ, లక్షగ్రన్థస్తు చాంగిరాః
ఏతైస్తు నవ వింశద్భిః సంహితా క్రమముచ్యతే ॥ ౧౧౦

తేనైవ ఋషిణాప్రోక్తం, సూత్రే తద్ద్వివిధం స్మృతమ్
తయోర్భేదం పృథగ్వక్ష్యే, పూర్వం శుద్ధం తథోచ్యతే ॥ ౧౧౧

చత్వారింశత్తు సంస్కారై, ర్నిషేకాదీన్యథాక్రమమ్
స్వగృహే దేవమానీయ, పూజయే ద్విష్ణుమవ్యయమ్ ॥ ౧౧౨

అతన్ద్రితమనాభూత్వా, నిత్యహోమ పరాయణః
పరార్థం నైవకుర్వీత, ఏతచ్ఛందఇతి స్మృతమ్ ॥ ౧౧౩

గ్రామ స్యవాసిన స్సర్వే, మాన్యంచాగ్ని హోత్రకమ్
అనాహితాగ్ని విప్రాణాం, అగ్నిహోత్ర ఫలం లభేత్ ॥ ౧౧౪

ఆహితాగ్నిషు సర్వేషు, న్యూనాధిక్యాది పూరకమ్
అతిరిక్తం నైవకుర్యాత్, శృతిరాహద్విజోత్తమాః ॥ ౧౧౫

తస్మాత్సర్వప్రయత్నేన గ్రామమధ్యాలయార్చనమ్
అథవాపశ్చిమేతత్ర, కల్పయిత్వార్చయేద్బుధః ॥ ౧౧౬

శ్రౌతవద్వీక్ష్యతే విద్వాన్, కాశ్యపేయోక్తవత్క్రమాత్

**★ యజనం ద్వివిధమ్ ★**

ఆత్మార్థం యజతేయత్ర, పరార్థంతత్రనాచరేత్ ॥ ౧౧౭

పరార్థం యజతేయత్ర, ఆత్మార్థంత్వర్చయేద్బుధః
సర్వశాంతికరంచైవ, సర్వపుష్ట్యర్థమేవచ ॥ ౧౧౮

సర్వాశుభవినాశార్థం, చతుర్వర్ణస్యభేదకమ్
అర్చనం పూజనం చైవ, శాంతికం పౌష్టికం తథా ॥ ౧౧౯

బల్యుత్సవాదినాయుక్తం పరివారైస్సమావృతమ్
ధాత్రాదిభూత పర్యన్తం సప్తత్యేకోత్తరంపృధక్ ॥ ౧౨౦

వాహనాయుధవర్ణంతు, పరిషట్కంసమర్చయేత్
ఏతైస్సర్వైశ్చ సంపూర్ణం, షట్కాలంచైవ పూజయేత్ ॥ ౧౨౧

అగ్నిహోత్రాదినాహోమే, కించిన్న్యూనాధికం యది
తత్తద్దోషస్య శాంత్యర్ధం, విష్ణ్వర్చన ముదాహృతమ్ ॥ ౧౨౩

వైఖానసేన సూత్రేణ నిషేకాది క్రియాన్వితః
గృహస్థో బ్రహ్మచారీవా,భక్త్యైవార్చనమారభేత్ ॥ ౧౨౩

శాస్త్రస్యకృత్యంచాధిక్యం, నిత్యం విధివదర్చనమ్
తేనైవతత్ప్రకారేణ, నిత్య పూజాంసమాచరేత్ ॥ ౧౨౪

తస్మాత్సర్వ ప్రయత్నేన, వైదికాఖ్యం సమాచరేత్
ఏవంక్రమేణ సంప్రోక్తం, సూత్రమేవమితిస్మృతమ్ ॥ ౧౨౫

★ నవషట్పంచ మూర్తిక్రమః ★

నవమూర్తేర్నవవ్యూహం, షణ్మూర్తే ర్వ్యూహషట్కం
నవషట్పంచ మూర్త్యాఖ్యే, వ్యూహంచేతిచ సర్వధా ॥ ౧౨౬

నవషడ్వ్యూహమిత్యుక్తం, తత్రభేదం నపశ్యతే
అథవాచైక మూర్తింవా, స్థాపయిత్వా సమాహితః ॥ ౧౨౭

★ భోగార్థీ శ్రీకృష్ణ స్యస్థాపనమ్ ★

లీలాయష్టిధరంకృష్ణం, వేణునాసహితం విభుమ్
రుక్మిణీ సత్యభామాభ్యాం, తార్క్ష్యయుక్తంయధాక్రమమ్ ॥ ౧౨౮

బోగార్థీ స్థాపయేన్నిత్యం, విధినాసమ్యగర్చయేత్ ౧౨౯

★ వీరార్థీ విజయార్థీచరామస్య స్థాపనమ్ ★

వీరార్థీ విజయార్థీవా, స్థాపయేదర్చయేత్క్రమాత్
రామంచ లక్ష్మణంచైవ, శత్రుఘ్నం భరతంతథా ॥ ౧౩౦

సీతాంచవాయుసూనుంచ, సంకల్ప్య విధినార్చయేత్
పురుషసూక్త విధానేన, కర్షణాదిషు కర్మసు ॥ (?) ౧౩౧

తేనైవతత్ప్రతిష్ఠాచ తత్క్రమేణార్చనేకృతే
వైఖానస విధానేన, పూజయిత్వాన దోషకృత్ ॥ ౧౩౨

వైఖానస విధానేన కర్షణాదిక్రియాన్వితమ్
తేనైవతత్ప్రకారేణ నిత్యపూజాంసమాచరేత్ ॥ ౧౩౩

పురుషసూక్త విధానేన చార్చయిత్వానదోషకృత్ (?)
ఏతద్విధిద్వయం సౌమ్యం వేదవిద్భిరనుష్ఠితమ్ ॥ ౧౩౪

ఇతి శ్రీవైఖానసే భృగుప్రోక్తాయాం సంహితాయాం వాసాధికారే
ఋషిప్రశ్నోత్తరంనామ ప్రథమో ऽధ్యాయః

# ద్వితీయో ऽధ్యాయః

**కర్షణమ్**

అతః పరం ప్రవక్ష్యామి, కర్షణాదీన్యథాక్రమమ్
కర్షణస్య దినాత్పూర్వం, అంకురం తత్రచార్చయేత్ ॥ ౧

హలం తత్ర ప్రయోగంచ యుగరజ్జుర్విశేషతః
యథార్హం శిల్పశాస్త్రోక్తం, ఆహరేత ప్రయత్నతః ౨

**★ అనడుహ లక్షణమ్ ★**

శ్వేతరక్త వృషాభ్యాంతుబంధయేద్దేశికోత్తమః
రుద్రమన్యం తతోజప్త్వా త్రయంబక మితిబ్రువన్ ॥ ౩

బంధయిత్వా వృషౌతత్ర, యుగాగ్రాభ్యాంతు యోజయేత్
మిశ్రవర్ణం తథాకృష్ణం, బాలంవృద్ధంతు రోగిణమ్ ॥ ౪

కర్ణౌశృంగే తథాపుచ్ఛం, హీనాంగాదీని వర్జయేత్
త్వాంఖనామీతి ఉచ్చార్య, పూర్వాంతంచోత్తరాంతకమ్ ॥ ౫

కర్షయిత్వాతు మన్త్రజ్ఞః, ద్వాదశావర్త్యకారయేత్
సర్వత్రకృష్ట భూమ్యాంతు, బీజాన్ సర్వత్రవాపయేత్ ॥ ౬

కంకుముద్గ యవాశ్చేతి గోధూమ చణకానపి
మసూర సర్షపాశ్చైవ షష్టికాదీనిచా హరేత్ ॥ ౭

